# స్వాతంత్ర్యమునకై జెకోస్లోవేకియాలోని జర్మనుల ఆందోళన

తమ దేశస్వాతంత్ర్యమునకై జెకోల ప్రతిజ్ఞ

బర్లిను మే ౨

జర్మనీలోని గోరింగు గారి అభిప్రాయమును వెల్లడించు 'నేషనల్ జీటంగు' అను పత్రిక ఇట్లు వ్రాయుచున్నది:—

జెకోస్లోవేకియా రాజ్యములోని జర్మనులు తమకు కోరదగినవాన్నిట, స్వాతంత్ర్యమును గూర్చి జెకోస్లోవేకియా ప్రభుత్వముతో వివాదపడుచు ఆందోళన చేయుచున్నారు. అచటి జర్మనుల కోరికలనుగురించి జెకోస్లోవేకియా ప్రభుత్వమే ఆలోచించి ప్రత్యుత్తర మొసంగవలెను. కాని ఆరాజ్యములోని సమస్యలగురించి ఇప్పుడు జర్మనీయును, యితర రాజ్యముల వారును సంప్రతించవలసిన ఆగత్యము లేదు. జెకోస్లోవేకియాలోని జర్మనుల కోరికలను వారి నాయకుడగు హెన్లిను నిర్వచించినవిధముగ, జెకో ప్రభుత్వమువారు ఏదైన నొక కార్యవిధానమును పూనుకొనినప్పుడు బ్రిటిషువారు జెకో ప్రభుత్వవిషయమై కొంత ప్రసక్తి కలుగజేసికొనవచ్చును. కాని బ్రిటిషువారును జర్మను ప్రభుత్వమును సాగించెడి సంప్రతింపులలో జెకో ప్రభుత్వవిషయమై చర్చింపబూనుట అనవసర ప్రసంగముగా నుండగలదు.

## జెకోల ప్రతిజ్ఞ జర్మనుల పట్టుదల

ప్రేగ్ మే ౨

జెకోస్లోవేకియాలో మే సెలారంభోత్సవము దేశమంతటను జరిగెను. జెకోలు తమకంఠములలో ప్రాణమున్నంతవరకును, జెకోస్లోవేకియా దేశస్వాతంత్ర్యమునకు భంగమురాకుండ కాపాడెదమని ప్రతిపట్టణములోను జరిగిన సభలయందు చెప్పిరి.

జెకోస్లోవేకియాలోని జర్మనుల నాయకుడగు హెన్లినుగారు కారల్సుబాదులో ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి:—

జెకోస్లోవేకియాలోని జర్మనులు సర్వ స్వతంత్రాధికారులుగా నుండవలెనే గాని ఒక రాజ్యంలో చేరియున్న ఒక అల్పసంఖ్యాక సంఘముగా కొన్ని ప్రత్యేక సౌకర్యములను పొందుట చాలదు మనకు విజయము చేతులలోనే యున్నది.

# స్విట్జర్లాండు ఎల్లప్పుడును తటస్థముగ నుండగోరుట

నానాజాతి సమితికి లేఖ

బెర్ను: ఏప్రిల్

అయిరోపాలో ఎటువంటి పరిస్థితులు ఏర్పడియున్నను స్విట్జర్లాండు దేశము మాత్రము ఎల్లప్పుడు తటస్థముగా నుండును అని నానాజాతి సమితివారు ప్రకటించవలెనని కోరుచు స్విట్జర్లాండు ప్రభుత్వమువారు ౨౯వ తేదిన లేఖపంపిరి.

స్విట్జర్లాండు ఎల్లప్పుడు తటస్థముగా నుండెను. ఇప్పుడుకూడ తటస్థముగా నుండగోరుచున్నది. అందుచేత స్విట్జర్లాండుయొక్క తటస్థభావమును నానాజాతిసమితి పూర్తిగ అంగీకరించబడెను అని ఈలేఖ కోరుచున్నది.

# బాలికల ఉన్నతపాఠశాల

కార్యదర్శులు

హైదరాబాద మే ౫

విరాళములు

శ్రీయుత రామాచారిగారు (హైకోర్టువకీలు) పాఠశాల మందిర నిర్మాణమునకై రు.౫౦౦ లు వాగ్దానమొసర్చి, రు ౧౦౦ లు పంపి కమిటీవారి కృతజ్ఞతాబద్ధుల జేసిరి.

వివాహకట్నము

శ్రీయుత యాదయ్యగారు తమతమ్ముని వివాహసందర్భమున రు ౫లు పాఠశాలకు సమర్పించి తమ స్త్రీ విద్యాభిమానము ప్రకటించిరి. వధువు ఈబాలికా పాఠశాల విద్యార్థిని.

మూత

౧మే ౧౯౩౮ నుండి ఎండకాలపు సెలవులకు పాఠశాల మూయబడినది. ౧ జూను నాడు మరల తెరువబడును. అప్పుడు పాఠశాల కొత్త యింటిలోనే యుండును. ౩౦ ఏప్రిలునాడు బాలికలకు మిఠాయిలు ఎప్పటివలె పంచిపెట్టబడెను. ఉపాధ్యాయులకు కార్యనిర్వాహకులు అల్పాహారవిందు జరిపిరి

చీఫు ఇన్స్పెక్ట్రెసుగారు

మిస్ నంది (బాలికా పాఠశాల చీఫ్ ఇన్స్పెక్ట్రెసు)గారు, ౨ మేనాడు ఉదయమున ౧౦ ౧-౩౦ వేళ పాఠశాలకొరకు కట్టబడుచున్న మందిరమును పరిశీలించి సంతోషము తెలిపిరి.

---

గోలకొండపత్రిక

బహుధాన్య నామ సంIIర వైశాఖ శుII ౬

గురువారము

# మ. ఘ. వ. నిజాంప్రభుత్వపు రైల్వే శాఖనివేదిక

మన రాష్ట్రపు రైల్వే ప్రభుత్వశాఖలలో చేరిన తర్వాతను:డీగూడ ఇంతవరకును దానివార్షిక నివేదికలు మాకు లభించియుండలేదు. ఇపుడు స్లాటరుగారు ఏజంటు అయినప్పటినుండి రైల్వేశాఖనుగూర్చి అనేక విషయములను ప్రజలు అధికార ముఖమునుండియే పత్రికలలో తెలిసికొను సౌకర్యమేర్పడుట పూర్వపురైల్వే పరిపాలనకును, స్లాటరుగారి క్రింద పరిపాలనమునకును భేదమును సూచించుచున్నది. స్లాటరుగారు ప్రత్యేకముగ రైల్వేశాఖ సంబంధముగై, ప్రజలు తెలిసికొనగోరు విశేషములను వారలకు తెలియజేయుటకై ప్రచురణోపశాఖ నొకదానిని నేర్పాటుచేసినారు. సాధారణముగా మన రాష్ట్రమందు అనేకశాఖల వార్షికపరిపాలన నివేదికలు మిక్కిలి ఆలస్యముగా పత్రికలకు పంపబడుచుండ, రైల్వేశాఖకు స్లాటరుగారి దయవలన ప్రచురణశాఖయొకటి ఏర్పడుటచే, రైల్వేపరిపాలనయందు జరుగు విశేషములు ఎప్పటికప్పుడు ప్రజలకు వెల్లడియగుటకు సౌకర్యమేర్పడుటయేగాక, వార్షికనివేదిక సంపూర్ణమైనది ఒకప్రక్క తయారగుచుండ, ప్రస్తుతము సంక్షేపనివేదిక, ౩౧ మార్చి ౧౯౩౮ తో అంతమగు సంవత్సరమునకు సంబంధించినది పత్రికలకు పంపబడినది. ఇది సంతృప్తికరమైన యంశము.

నివేదన సంవత్సరమందు క్రొత్త రైల్వేలైనుల నిర్మాణముగాని, ఉన్న లైనుల విస్తరణగాని జరుగకున్నను, రైల్వేలవల్ల ఆదాయము నివేదన సంవత్సరమునకు పూర్వసంవత్సరములోకంటె హెచ్చినది. ఖర్చులు మున్నగు అన్ని త్రోసివేయదగినవి త్రోసివేయబడగా మొత్తము రూ. ౧౨౭ లక్షల ఆదాయము వచ్చునట్లు తేల్చబడినది. నివేదన పూర్వసంవత్సరమందు రు ౧౧౫లు మాత్రమే ఆదాయము వచ్చియుండెను. ౧౯౩౬-౩౭ నుండి క్రమ క్రమముగ ఆదాయమిట్లు హెచ్చుచుండుట జూడ ఆర్థికదుస్థితినుండి వ్యాపారము తేరుకొనుచున్నదని భావించవచ్చును. నివేదనసంవత్సరమందు రైళ్లలో తిరిగిన ప్రయాణికుల మొత్తముసంఖ్య అంతకు పూర్వము సంవత్సరములో ౭౫ లక్షల నుండి ౮౯ లక్షలకు హెచ్చెను. రైళ్లపై తీసికొనిపోబడిన భారము ఇట్లే ౨౫ లక్షల టన్నులనుండి ౨౭ లక్షల ౫౦ వేల టన్నులకు హెచ్చెను. పనిజరిపించుటకగు ఖర్చులలో ఒక్కలక్ష రూపాయలు హెచ్చెను. ఆముశాలపంట చెడియుండనిచో రైల్వేశాఖయొక్క మొత్తము ఆదాయము ఇంకను హెచ్చియుండ వలసినదని నివేదికలో విచారము వ్యక్తముచేయబడినది.

నివేదిక సంవత్సరమందు ఖర్చులో ఒక లక్షరూపాయలు హెచ్చినందుకు పరిపాలనలో క్రొత్తవిశేషములు లేకపోలేదు. సికింద్రాబాదు—ద్రోణాచలముల మధ్యను, పూర్ణా-జాల్నా - ఔరంగాబాదుల మధ్యను అదనపుబండ్లు ప్రవేశపెట్టబడెను. సికింద్రాబాదు నిజామాబాదుల మధ్యను, నాం దేడు-పూర్ణా లైనుమీదను కూడ ఇట్టి అదనపుబండ్లు ప్రవేశపెట్టబడెను. సాధారణమైన ఛార్జీలకంటె ప్రతిశతి ౧౨½ మొదలుకొని ౫౦ వరకు నానారకముల తగ్గింపులు చేయబడిన ౧౭౫ రకముల టిక్కెట్లు ప్రయాణికులను చాలవరకు ఆకర్షించినవి. సామానుల ఛార్జీలలో గూడ ౧౧౧ తగ్గింపులు అనుసరించబడెను. సామానులు పూర్వముకంటె శీఘ్రముగా చేరవలసినచోటికి ఒక నియమితకాలమునకు చేరు ఏర్పాటులుచేయబడినవి ఇంతేగాక రైలుబండ్లలోనే ప్రయాణికుల సౌఖ్యములకు వలయు ఏర్పాటు లనేకములు చేయుబడినవి. ఈసౌఖ్యములలో ముఖ్యముగా గమనించదగినది మూడవ తరగతి డబ్బాల న్నింటిలోను పాయెఖానాలలో మంచి నీటివసతి నొనగూర్చుట. అనేకములైన ౩వ తరగతి డబ్బాలలో ఇప్పటికే యలెక్ట్రికు ఫంకా లమర్చబడుటయేగాక ఇక నిర్మించబడబోవు అన్నిడబ్బాలలోను యలెక్ట్రికుఫంకాలు తప్పక అమర్చుటకు నిశ్చయింపబడినది. ఈఫంకాలకంటె ముఖ్యముగ రైల్వేవారు ౩వ తరగతి ప్రయాణికుల కొరకు డబ్బాలలో ఇరుకులేకుండ సుఖముగా కూర్చుండునంత స్థలము లభించునట్లు చేయవలెను. ఏస్టేషనులోగాని క్రొత్తగా ఎక్కు మూడవతరగతి ప్రయాణికులు బండి కనబడిపోవునేమోయను తొందరలో డబ్బానుండి డబ్బాకు ఆదుర్దాతో పోవుచు ప్రతిడబ్బాలోని వారిచేతను స్థలములేదను నిరసమునకు పాత్రులుగాకుండ చేయవలెను. రైల్వే ఆవరణలో 'అనారోగ్యకరమగు ఆహారపదార్థములు అమ్మబడకుండనట్లు రైల్వే అధికారులు కనుపెట్టియున్నారను అంశము సంతోషకరమైనది.

రైల్వేశాఖవారే రాష్ట్రమంతటను బస్సుసర్వీసులనుగూడ నిర్వహించుచున్నారు. ఈబస్సు సర్వీసులచే ఆక్రమించబడిన దూరము పూర్వసంవత్సరమందు ౩౭౭౭ మైళ్లనుండి నివేదన సంవత్సరమందు౪౦౭౯ మైళ్లకు హెచ్చినది. బస్సుల సంఖ్య ౩౧౮ నుండి ౩౭౨ కు హెచ్చినది. కాని ఇప్పటికిని ఈబస్సుశాఖ మొత్తము రాష్ట్రపురోడ్ల దూరములో మూడింట రెండుపాళ్ళ వరకు మాత్రమే ఉపయోగించుచున్నది. ప్రయాణికుల సంఖ్య పూర్వ సంవత్సరములో ౧౦౭ లక్షల ౫౦ వేలమండి ౧౧౭ లక్షల ౫౦ వేలకును, సామానుల భారపరిమాణము ౮౦౦౦ టన్నుల నుండి ౭౧౦౦౦ టన్నులకును హెచ్చినది. ఖాస్గీ బస్సులు తొలగించబడిన తర్వాత, ఆబస్సుల వ్యాపారము ప్రభుత్వపుబస్సులకు వచ్చుటచే ఇట్టిహెచ్చుదల కనపడుట సహజమే. ఖాస్గీబస్సులు తొలగించబడిన తర్వాత కొన్నిమాసముల వరకుగూడ బస్సులసంఖ్య ప్రయాణికుల సంఖ్యకును సౌకర్యమునకును చాలదను మొఱలు విశేషముగా నుండెను. కొద్దిమాసములనుండి ఆమొఱలు పూర్వమంత ఎక్కువగా మాకు వచ్చుటలేదు. నివేదన సంవత్సరమందు బస్సు సర్వీసులపై ఖర్చులుపోను నికరాదాయము రు ౨ లక్షల ౮ వేలు తేలినది. ఇదిపూర్వ సంవత్సరములో వచ్చినదానికంటె ౧ లక్ష ౨౩ వేలును, అంతకు పూర్వసంవత్సరములో నికరాదాయముకంటె 33 వేలును తక్కువగానున్నది. ఇందుకునివేదికలో ఇచ్చిన అంకెలనుబట్టి ఊహించదగిన కారణము మొత్తము ఆదాయము హెచ్చుదలకంటె ఖర్చు హెచ్చుదల భారముగ నుండుటయే కనపడుచున్నది. రైళ్లకును బస్సులకును ౨౩౮ చోట్ల సంబంధము సరిగా ఏర్పరచబడినది.

నివేదన సంవత్సరమందు గమనించదగిన ఒక విశేషమేమన నిజాంరాష్ట్రమందలి విశేషములను చూడగోరు వారలకై ప్రత్యేకములైన ఛార్జీల సౌకర్యములతో యాత్రలేర్పరచబడెను. రైళ్ళపైనేమి, బస్సులపైనేమి, లేక రెంటిపైనేమి సాగించబడిన అట్టియాత్రలను ౧౦౦౦౦ మంది అనుభవించిరి. నిజముగా ఈయాత్రలు చాలమంది ప్రజల నాకర్షించినవి, ఇంకొక విశేషమేమం రైళ్లకు బస్సులకుకూడ ఉపయోగించు టిక్కెట్లు యాత్రలలోను, ఇతర సమయముల లోను ఒసగబడినవి. మూడవ విశేషమేమనిన, సికిందరాబాదు, హైదరాబాదు, వరంగల్లులలో ఏచోటికంటె ఆచోటికి సామానులను చేర్చు బస్సుసర్వీసు వ్యాపారస్థులకై ఏర్పాటు చేయబడెను. ఇదియు నానాటికి లాభకరమగుచున్నట్లు చెప్పబడినది. కడపట గమనించదగిన విశేషము ప్రభువుగారు రైల్వేశాఖవారికి విమానపు సర్వీసు నేర్పాటుచేయుటకు అధికార మొసగుచు ఫర్మాను ప్రసాదించుటయెయున్నది. అప్పుడే విమానములు దిగు ప్రదేశములను బాగుచేయుటకై పనిచేయబడుచున్నది. రైల్వే ఏజంటుగారికే రాష్ట్రమందు పరిశ్రమల అభివృద్ధికై సౌకర్యములను ఒనగూర్చుపని పెట్టబడినది. అందువిషయమై, రాష్ట్రములో ఇవు డే యేపరిశ్రమలకు సౌకర్యములుగలవో తెలుపు ఒక రిమ్యమైన పుస్తకము ప్రకటించబడినది.

మొత్తముమీద నివేదిక చదువుటకు చాలసంతృప్తిగానున్నది. కాని నివేదికలో వర్ణించబడిన వాటికిని ఇంకను సాధించదగిన వాటికిని గల తారతమ్యముకూడ చూడదగును. అట్టిసాధించదగిన వాటిలో రైలు బండ్లును, బస్సులును ఇప్పటికిని ప్రయాణికుల ఒత్తిడికి చాలినంత విస్తరించవలసియుండుట ఒకటి. కాని మొత్తముమీద రైల్వేపరిపాలనను ప్రయాణికులగు ప్రజలకును, వ్యాపారస్థులకును ప్రశంసాపాత్రముగ చేయవలెనను శ్రద్ధయొకటి స్లాటరుగారి నివేదికయందంతటను కనుపించుచున్నంతవరకు ఇప్పటికిని కొరవగానుండు విషయములు సాధ్యమైనంత త్వరలో పరిపూర్తి జెందగలవని ఆశించుటకు అవకాశ మేర్పడుచున్నది.

# హిట్లరుగారి చల్లని చూపుకై జెకోస్లోవేకియా శ్రద్ధ

ప్రేగ్: ఏప్రిల్

హేర్ హిట్లరుగారికి డాక్టరు బీన్సు సందేశము

"జర్మను జాతికంతటికిని విరామ దివసమగు మేమాస ప్రారంభదినమున తమకు నా హృదయపూర్వక అభివాదనములను తెలుపుచున్నాను" అని జర్మనీ నియంత హిట్లరుగారికి జకోస్లోవేకియా అధ్యక్షుడగు డాక్టరుఎడ్వర్డు బీన్సుగారు శుభసందేశమును పంపిరి.

జర్మనీ దేశముతో జకోస్లోవేకియావారు విరోధము పెట్టుకొని పని సాధించు ఉద్దేశములేదని తెలుపుటకై డాక్టరు బీన్సుగారు హిట్లరుకు యీ శుభసందేశమును పంపిరట. ఇంతకు పూర్వము కూడ అప్పుడప్పుడు బీన్సుగారు ఇట్టిసందేశములను పంపుచుండుటకలదు. వానికి అప్పుడు ప్రాముఖ్యతే మేదియు లేకపోయెను. ప్రస్తుత పరిస్థితులలో దీనికి ప్రత్యేక ప్రాముఖ్యత కలిగినది.

## కుట్ర వదంతి కల్ల

లండను: ఏప్రిల్

జకోస్లోవేకియా దేశమున జర్మనువాజీలు నివసించు జిల్లాలలో గల్లంతు లేవదీయవలెనని కుట్రలు జరుగుచున్నట్లు బర్లినునగరము నుండివచ్చిన వార్తలన్నియు కల్లలు, కల్పితములు అని లండనులోనుండు జకోస్లోవేకియా రాయబారి చెప్పుచున్నారు.

# అంతర్జాతీయ వలసలో జపానుసేనలు బ్రిటిషురోడ్డు నాక్రమించుటు

షాంగ్ హాయి: మే ౨

నిన్న అంతర్జాతీయ వలసలో ఒక జపాను లారీపై ఎవరో ఒక చిన్న బాంబును విసిరిరి. వెంటనే జపానుసైనికులు అంతర్జాతీయ వలసమధ్యనున్న నాన్ కింగు రోడ్డులో కొంతభాగమును ఆక్రమించి, ఇండ్లనన్నిటినిజాగ్రత్తగ వెతకిరిగాని బాంబు విసరినవాడు తప్పించుకొనిపారిపోయెను.

ఆక్రమణము

నాన్ కింగురోడ్డును జపానువారు ఆక్రమించుకొనుటవల్ల, అంతర్జాతీయవలసలోని బ్రిటిషు సేనానిఅయిన 'మేజర్ జనరల్ టెల్ఫర్ స్మాలెట్టు ఒక బ్రిటిషు సైనికదళమును నాన్ కింగు రోడ్డుపైకి పంపిరి.

నాన్ కింగురోడ్డు బ్రిటిషు రక్షణస్థావరములోనిది అందుచేత అరోడ్డుపై జపాను సైనికులు వుండుటవల్ల బ్రిటిష్ హక్కులకు భంగము కలుగును. కనుక జపానుసైనికులను అచటినుండి మరలించవలెనని టెల్ఫర్ స్మాలెట్ గారు జపాను అధికారులను కోరిరట.

తుదకు జపాను అధికారులకు బ్రిటిషు అధికారులకు ఏదోఒప్పందము కుదిరినది. బ్రిటిషుసైనికులు జపానుసైనికులు నాన్ కంగు రోడ్డునుండి వెనుకకు మరలిరి.

# హిట్లరు గారి ఇటలీ ప్రయాణము

బెర్లినులో వీడ్కోలు

బెర్లిన్, మే ౨,

హిట్లరుగారు సపరివారముగ నేడు రోముకు బయలుదేరిరి. బెర్లిను నగరవాసులందరు వారికి వీడ్కోలొసగుటకొరకు కార్మికులకందరికి నేడు సగమురోజు సెలవిచ్చిరి. హిట్లరుగారు స్టేషనుకు పోవునప్పుడు కార్మికులు పురజనులు దారి పొడుగునవిల్చొని వారికి జేజే లొసర్చిరి.

హిట్లరు ఇటలీ ప్రయాణమునకు ౮-౮ంగంటలకు రెండు స్పెషలు ట్రెయినులు బెర్లినునుండి రోమునకు బయలుదేరినవి. మొదటిదానిలో హిట్లరు, గబెల్సు, రిబ్బన్ట్రాపు, హెర్. ఫ్రాన్కు-గార్లు మంత్రులుండిరి. రెండవదానిలో విదేశాంగ కార్యాలయములోని ముఖ్యోద్యోగులు, నాజీ సంఘములోని ముఖ్యసభ్యులు, సైనిక, పోలీసు శాఖల నాయకులు ఉండిరి.

హిట్లరుగారు ఇటలీలో ఉన్న రోజులలో వారిబదులు గోరింగుగారు బెర్లినులో పనిచేయుచుందురు. వారు స్టేషనుకు ప్లాట్ ఫారముపై హిట్లరుకు వీడ్కోలొసగుచు ఇట్లనిరి:—

"మీరు ముస్సోలినీగారిని కలుసుకొనుటవల్ల రోమ్-బెర్లిన్ సౌహార్దముయొక్క బలము తిరిగి ప్రపంచమునకు చాటబడును. మీరిద్దరు ప్రస్తుతకాలములోని మహాపురుషులు. మీసంభాషణలవలన జర్మను, ఇటలీ ప్రజలయొక్క శాంతిభద్రతలేకాక ప్రపంచ మంతటియొక్క శాంతిభద్రతలకు కూడ లాభము కలుగును."

# సోషలిస్టులు, హిందూ సభ్యులు కొట్టుకొనుట

పోలీసులు శాంతిని స్థాపించుట

పూనా, మే ౩

ఇక్కడి హిందూ మహాసభ్యులకును సోషలిస్టులకు తీవ్రద్వేషములు ప్రబలియున్న స్థితిలో, మొన్నతిలకురోడ్డులోనున్న హరిజనకాలనీ (ఆశ్రమము)లో ఒకసభ కొల్హాపూరు శాస్త్రి జగద్గురువుగారి ఆధ్యక్షతవ ఒకసభజరుపబడెను. వినాయక దామోదర సావర్కరుగారు ఉపన్యసించవలసియుండెను,

ఇంతలో హిందూసభ్యులు సోషలిస్టులకును, సోషలిస్టులు హిందూసభ్యులకును ఆగ్రహము కలిగించు కేకలువేసిరి, దానిపై చేతులు చేతులు కలియబడెను. రాళ్లు విసరుకొనబడెను. ఇద్దరు సోషలిస్టుయువకులు నెత్తురుకారుచుండ ఆస్పత్రికి తీసికొనిపోబడిరి.

పోలీసులు వచ్చునప్పటికే దెబ్బలాడుచున్నవారలు పారిపోయిరి. సాయుధ రక్షకభటులు రప్పించబడి అచ్చటయుంచబడిరి.

హరిజన కాలనీవద్ద అంతర్వర్ణ వివాహములు జేసికొనిన దంపతులు ముగ్గురువచ్చిన ఒకవిందు జరుపబడెను. అది శాంతముగ జరిగిపోయెను, కలభా జరిగినచోటికి చుట్టుప్రక్కలనుండిన స్థలములలో జరుపదలచుకొన్న సభలు నిలిచిపోయెను.

* * *

## మరలదెబ్బలు

పూనా, మే౪

నేడుదయము గల్లీలలో హిందూబాలురచేరి కాంగ్రెసుటోపీలను ధరించినవారలను కర్రలతో మర్దించిరి. మర్దించి ఇండ్లలో దూరుకొనిరి. నిన్నరాత్రి దెబ్బలుతిన్న తమమిత్రులనుచూచుటకై పోవుచున్న సోషలిస్టులనుగూడ హిందూగుండాలు ఏడ్పించిరట.

పోలీసు సూపరింటెండెంటు ఇతరాధికారులతో కలిసి నేడుదయము గలభాజరిగినచోటికి పోయిచూచిరి. అక్కడక్కడ పోలీసులుంచబడిరి, పిదప మూలలయిండ్లలో తుంటరులు చేరి "కాంగ్రెసు నశించుగాక" "హిందూమతము వర్ధిల్లుగాక" అను కేకలను వేయుచుండిరి.

ఈసాయంకాలము "హిందూయొకుల దుర్మార్గములను ఖండించుటకై" సోషలిస్టుల సభజరుగునని ప్రకటించిరి

---



---

